# బాల్యము

ఫిన్నీ అమెరికాలోని కనెక్టికట్ రాష్ట్రంలోని వారిస్‌లో ఆగష్టు 29, 1792వ సంవత్సరంలో జన్మించాడు. రెండేళ్ల వయస్సులో నాన్నగారు ఒనెడా కౌంటి న్యూయార్క్‌కు మకాం మార్చవలసి వచ్చింది. అటవీ ప్రాంతంలో మత సంబంధమైన కార్యక్రమాలు జరిగేవి కావు.

వారి నాన్న ఫిన్నీ ఇంటి ప్రక్కన చిన్న ప్రార్థనా మందిరం నిర్మించాడు. అక్కడ పరిచర్య చేయడం మొదలెట్టాడు. తిరిగి వారి నాన్న గారు కొన్ని పరిస్థితులను బట్టి ఒంటారియో సరస్సు ప్రాంతానికి, శాకెట్ ఓడ తీరానికి దగ్గరకు మకాం మార్చవలసి వచ్చింది. ఇక్కడ చాల సంవత్సరాల పాటు మత విశ్వాసాలకు సంబంధించిన కార్యక్రమాలు జరగలేదు. ఒనిడా ప్రాంతంలో జరిగినట్లు ఇక్కడ మత సంబంధమైన విషయాలు జరిగేవి కావు కనుక ఫిన్నీకి చిన్నప్పటినుండి మత విశ్వాసాలకు సంబంధించిన

జ్ఞానము కొరవడియున్నది.

'ఆడమ్స్'లో న్యాయశ్రాస్తం అభ్యసించే కాలం నాటికి క్రైస్తవానుభవం శూన్యం. ఫిన్నీ ఎక్కువగా అటవీ ప్రాంతాలలోనే పెరిగాడు. సబ్బాతును గూర్చి ఏదో చూచాయగా తెలుసు పూర్తి అవగాహన లేదు. ఆడమ్స్‌లో తానొక విద్యావంతుడైన ఫాదర్ దగ్గర ఎక్కువ కాలం చదువుకొనవలసి వచ్చింది. రెవ. జార్జి డబ్ల్యు. గేల్. ప్రిన్స్‌టౌన్, న్యూజెర్సీలో ఆయన ప్రెస్బిటేరియన్ సంఘ కాపరిగా ఉండేవారు.

న్యాయశ్రాస్త పాఠాలు చదువుకొనే తొలిరోజుల్లో ఆనాటి పూర్వతరానికి చెందిన రచయితలు తమ గ్రంథాల్లో మోషే ధర్మశ్రాస్త్రంలో నుంచి కొన్ని భాగాలు ఉదాహరిస్తు వ్రాస్తూ ఉండేవారు. ఆనాడు మోషే విధించిన కట్టుబాట్లు. ఈనాటి సామాటిక జీవన విధానాన్ని నిర్దేశించడానికి కూడా తగినట్లుగా, ఆధారభూతమై ఉన్నట్లుగా సూచించబడడం అతడు గ్రహించాడు. అందుచేత న్యాయశ్రాస్త గ్రంథాల్లో బైబిలు భాగాలను

గురించిన ప్రసక్తి వచ్చినప్పుల్లా, వాటిని పరిశీలనగా చూడాలన్న ఆసక్తి కొద్ది ఒక బైబిలును కొన్నాడు. ఇదే అతడు సంపాదించుకొన్న మొట్టమొదటి బైబిలు గ్రంథం. ఈవిధంగా ఇతడిలో బైబిలు చదవాలన్న ఆసక్తి పెరిగింది. బైబిలులోని కొన్ని భాగాలను ధ్యానం యసాగాడు. ఇంతకు ముందెన్నడు ఇలా చేసి ఎరుగడు. కొన్ని భాగాలు తనకు అర్ధమయ్యేవికావు. అర్థము కాని సంగతులను గూర్చి అక్కడి ప్రెస్బిటేరియన్ సంఘ కాపరియైన రెవ. గేల్ గారితోను. సంఘ పెద్దలతోను సంప్రదించేవాడు. ఈ విధంగా ఆధ్యాత్మిక చర్చలు కొనసాగించే కొద్ది ఇతడిలో అశాంతి ఎక్కువ కాసాగింది. ఒకవేళ తాను గనుక ఇప్పుడు చనిపోతే మోక్షంలో ప్రవేశించే భాగ్యం ఉండదేమో నన్న భావం హృదయంలో బాగా పాతుకపోయింది. హృదయంలో కల్లోలం అధికం కాసాగింది.

## హృదయ వేదన

1821వ సంవత్సరం ఒక సబ్బాతునాడు తన హృదయంలో కలిగే అశాంతి గూర్చి, రక్షణను గూర్చి ఎక్కువగా ఆలోచించి [1]రక్షింపబడాలని తలంచాడు. సోమ, మంగళ వారాల్లో ఈ హృదయ పరివర్తన విషయైన తీవ్రత చెలరేగింది. అయితే అంతకంతకు తన హృదయం మొడికేసింది. మంగళవారం రాత్రి అతడిలో కలవరం రేగింది. ఆ రాత్రే తాను మరణిస్తానేమోనన్న భయాందోళన, మరణిస్తే నరకానికి పోవాల్సి ఉంటుందేమోన్న భీతి అతణ్ణి ఆవరించింది. ఎలాగో ఆ రాత్రి తెల్లవారే వరకు తమాయించుకున్నాడు. మరుసటి రోజు బుధవారం ఉదయాన్నే లేచి ఆఫీసుకు బయల్దేరాడు ఫిన్నీ. ఆఫీసుకు వెళ్ళాడేగాని అతడి మనస్సు ఒక రాగానే కుదుటపడడం లేదు. దేనికోసం వేచిఉన్నావు? ఏమి చేయాలనుకుంటున్నావు? అంటూ తన అంతర్వాణి తనను ప్రశ్నించినట్లు అనిపించింది. ఆ రోజు ఫిన్నీ తన జీవితంలో ఏనాడు చూడని విధంగా క్రీస్తు ప్రాయశ్చిత్త కార్యంలోని సంపూర్ణత చూడగలిగాడు. ఆ ప్రత్యక్షత అతడి మనోనేత్రాల ముందు అలాగే కొంచెం సేపు నిలిచింది. "వెంటనే

ఈ సత్యాన్ని నీవు నా హృదయంలో అంగీకరిస్తున్నాను జవాబు చెప్పాడు. ఎవరు చూడకుండ ఉండేందుకు అడవిలోకి వెళ్ళాడు. హృదయాన్ని దేవుని యెదుట కుమ్మరించాలని భావించాడు. అతడి హృదయం అందుకు తడబడతు ఉంది. గాలికి ఆకులు కదులుతుంటే, ఎవరో వస్తున్నట్లుగా భావించి కళ్లు తెరచి చూచేవాడు. అక్కడ ఎవ్వరు కనిపించేవారు కాదు. తనను ఎవరైనా చూస్తున్నారేమోనని భ్రమించేవాడు. తన 'అహమే' తన దేవుడికి సమీపంగా ఉండకుండ ఇలా అభ్యంతరం పెడుతోందని అతడు గ్రహించాడు. దేవుడి ఎదుట యిలా మోకరించడం ఎవరైనా చూస్తే ఎంత సిగ్గు చేటు అనే చెడుభావన తనలో ఉన్నట్లు గ్రహించాడు. వెంటనే మనస్సును నిబ్బరం చేసుకొని, ఏది ఏమైనా, లోకంలో మనుష్యులంతా చూడనీ, పిశాచాలు నన్ను చుట్టు ముట్టనీ గాక! నేను మాత్రం ఈ స్థలంలో ప్రార్థించడం మానను అని కేక వేశాడు.

నా హృదయంలో తళుక్కున ఒక వాక్య భాగం ప్రత్యక్షమైంది. "నీవు వెళ్ళి ప్రార్థించు, నీ ప్రార్థనను నేనాలకిస్తాను. నన్ను వెదకి కనుక్కో, నీ హృదయం పూర్తిగా నన్ను" స్వరం ప్రబోధించింది. అప్పుడు తన భయంకర పావస్థితి ప్రత్యక్షమైంది దేవుని సన్నిధానంలో నిలువెల్లా కంపించిపోయాడు. ప్రభూ! నిన్ను అంగీకరిస్తున్నా, నిన్ను వెదకుతు ప్రార్థిస్తున్నా, ఆలకించమని ఆక్రందన చేశాడు. దేవుడు తన ప్రార్థన విన్నాడని ఫిన్ని గ్రహించాడు. తాను స్పృహలోనే ఉన్నట్లు గ్రహించాడు. ఒక అపూర్వమైన అనుభూతి పొందే వరకు పట్టుదలతో ప్రార్థించాడు. సువార్త ప్రకటించాలన్న ఆశతో తన గ్రామానికి తిరిగి వచ్చాడు. ఫిన్నీ జీవితంలో ఈ మహత్తర సంఘటన జరిగింది. అక్టోబర్ 10వ తేది 1821వ సంవత్సరంలో.

## ప్రభువు దర్శనం

తన హృదయాభిలాషను దేవునితో నివేదించుకొని, మనసారా ప్రార్థించు కోవాలన్న తలంపుతో ఫిన్నీ ఆఫీసు వెనక ఉన్న ఒక గదిలోకి వెళ్లాడు. అది చీకటి గది. అక్కడ ఏ దీపము లేదు.

అయినా ఆ గదిలో గొప్ప వెలుగు ప్రకాశించింది. అతడు లోపలకు వెళ్ళి తలుపులు మూసుకున్నాడు. కాసేపటికీ ముఖాముఖిగా ప్రభువును చూచాడు. ఆ సమయంలో యేసు అతడితో ఏమి పలుకలేదు జాలిగా అతడి వైపు చూచాడు. అంతే! ఆ చూపుతో ఫిన్నీ హృదయం బద్దలైపోయింది. పసి పిల్ల వాడిలా బిగ్గరగా ఏడుస్తూ ప్రార్థించాడు.

## మొట్ట మొదటి ఉజ్జీవం - పరిచర్యకు పిలువబడుట

ఆరోజు ఉదయాన్నే ఫిన్నీ ఆఫీసుకు వెళ్లాడు. రక్షణను గూర్చి "రైట్" గారితో సంభాషించాడు. ఫిన్నీ మాటాలకు అతడు ఆశ్చర్యపోయాడు. రక్షణను గూర్చి కొద్దిసేపు ముచ్చటించాడు. అప్పుడు ఆయన మౌనంగా విన్నాడు. ఆ కొన్ని మాటలు ఆయన హృదయాన్ని కత్తివలె చీల్చివేశాయి. అతడు రక్షింపబడునట్లు ఆ మాటలు చేశాయి.

అక్కడ నుండి ఫిన్నీ మరొక సభ స్థలికి పిలువబడ్డాడు. అక్కడ అనేకులు వాక్యం విని రక్షింపడ్డారు. అక్కడ జరిగిన సంఘటనలన్ని నా మనో ఫలకం మీద నిలిచిపోయాయి. ప్రభువు నన్ను వాక్యం ప్రకటించడానికి పిలిచినట్లు గ్రహించాను.

ఆ రోజు చాల మందితో వ్యక్తిగతంగా మాట్లాడాను. పరిశుద్ధాత్మ వారందరిని వాక్యం వినునట్లు చేశాడు. అక్కడ నేనేమి మాట్లాడానో గుర్తులేదు కాని విన్న వారందరు రక్షింపడ్డారు. ఆరంభంలో ఫిన్నీ గారి పరిచర్య వ్యక్తిగతమైనదే.

కొన్ని రోజులు గడిచే సరికి ఆ గ్రామమంత ఎంతో మారిపోయింది. కొందరు ఒక రకంగాను మరికొందరు మరోరీతిగాను చెప్పుకొనేవారు. ప్రభువు వారి హృదయాల్లో చేసిన నూతన మార్పుతో అనేకుల జీవితాలు మారిపోయాయి. అక్కడ సాయంకాలం ప్రజలందరు ఒకచోట ప్రార్థనకు కూడుకున్నారు. నాకు వాక్యం చెప్పేందుకు అనుమతి లేకున్న, నేను లేచి నిలువబడి వాక్యం చెప్పసాగాను. అనేకులు ప్రభువు

వాక్యానికి లోబడి రక్షింపబడినారు. ప్రజలు రోజురోజుకు అనేకులు ప్రభువు దగ్గరకు వస్తున్నారు.

మరుసటి రోజు సభా స్థలికి వెళ్లాను. సేవకుడు, మరియు గ్రామ పెద్దలందరు ప్రోగైయున్నారు. ఆ ఇల్లు పూర్తిగా నిండిపోయింది. ఎవరో సభను ప్రారంభించే వరకు నేను నిలువలేకపోయాను. లేచి వాక్యం చెప్పసాగాను. అంతకు ముందెన్నడు అటువంటి సంఘటన నాకు జరుగలేదు. ప్రజలు గంటల తరబడి వాక్యం వింటు, తమ హృదయాలను ప్రభువుకు సమర్పించుకున్నారు. జరుగుతున్న పరిచర్య విశేషాలు ఆనోట ఆనోట అంతట వ్యాప్తి చెందాయి. ప్రతి గ్రామానికి వెళ్ళి సువార్త ప్రకటించడం మొదలెట్టాడు. ఫిన్నీ పరిచర్యలో అలుపెరుగకుండ విశ్రాంతి లేకుండ, నిర్విరామంగ తిరగడం వలన శరీరం అలసి పోయింది. వీలైనప్పుడు ఎక్కువ విశ్రాంతిని తీసుకుంటున్నాడు.

ఆడమ్స్ చుట్టు ప్రక్కల గ్రామాల్లో ప్రజలు వాక్యం వినడానికి తండోపతండాలుగా వచ్చేవారు. కొందరితో వ్యక్తిగతంగా మాట్లాడినప్పుడు, వాక్యం వారి హృదయాలను చీల్చివేసేది.

ఫిన్నీ యౌవనస్తుడిగా నున్నప్పుడు ప్రభువు ఆయనను బహుబలంగా వాడుకున్నాడు. "అతన్ని కలుసుకొని వాక్యం చెప్పమని" పరిశుద్ధాత్మ నడిపించేవాడు ఫిన్నీని.

ఫిన్నీ ఎక్కువగా ప్రార్థనలో గడపడం అలవాటు చేసుకున్నాడు. కొన్నిసార్లు 'విసుగక ప్రార్థించేవాడు.' ప్రార్థన పరిస్థితులను ఎంతో అనుకూలంగా చేసేది. దేవుని సన్నిధిలో సంతోషించడం ఫిన్నీ అలవాటు చేసుకున్నాడు. పరిచర్యలో ఏ కొంచెమైన ఫలబరితంగా లేకపోతే ఫిన్నీ నిద్రపోయేవాడు కాదు ఆహారం తినలేక పోయేవాడు. ఫలితాలను చూడకుండ తృప్తి చెందేవాడు కాదు. ఆత్మలో ప్రార్థించడం క్రైస్తవ జీవితంలో ఎంతో అవసరమని ప్రభువు ఫిన్నీకి నేర్పాడు. మొదట్లో ఫిన్నికి ప్రార్థనను గూర్చిన సరైన అవగాహన ఉండేది కాదు.

అంతా గజిబిజిగా ఉండేవాడు. "ఆత్మలు రక్షింపబడాలంటే ప్రసవ వేదన తప్పదని" అతి త్వరలోనే ఫిన్నీ నేర్చుకున్నాడు. అందుకు తగిన లేఖన భాగాలను అర్థం చేసుకున్నాడు.

1822లో ఒక వసంత కాలములో ఫిన్నీ ప్రెస్బిటేరియన్ సంఘ నాయకత్వం క్రింద, సువార్త సేవకుడుగా పనిచేస్తున్నాడు. ప్రిన్‌టన్‌లో వేదాంత విద్య నభ్యసించవలసిందిగా కొందరు అతడికి సలహా ఇచ్చారు. అయితే ఫిన్నీ ఒప్పుకోలేదు. ఆ ప్రెస్బిటరీ గురువు 'గేల్' గారి వద్ద ఉంటూనే వేదాంత విద్య అభ్యసించేటట్టుగా ఏర్పాటు జరిగింది. చివరకు 1824లో ప్రెస్బిటరీ సంఘం వారు ఫిన్నీని పరీక్షించి సువార్త ప్రకటించడానికి అనుమతినిచ్చారు. ఆ తరువాత జూలై 11, 1824న ఈవెన్స్ మిల్స్‌లో అభిషేకించబడ్డాడు. ఆరుమాసాల తరువాత గుర్రం మీద ఒక స్థలం నుండి మరొక స్థలానికి పయనిస్తు క్రీస్తు సువార్తను బోధించాడు. ఈ నిరంత శ్రమ వలన ఆరోగ్యం దెబ్బతిన్నది. ఎక్కువ కాలం బ్రదకడనుకున్నారు. స్నేహితులు, అంతకంటె గురువు గేల్ గారు అర్థ గంట కంటె ఎక్కువ సేపు ప్రసంగం చేయవద్దని సలహా ఇచ్చారు. ఫిన్నీ వారి మాటలు పెడచెవిని బెట్టి రాత్రింబగళ్ళు ప్రసంగించేవాడు. అద్భుత రీతిగా ప్రభువు ఫిన్నీని ముట్టి స్వస్థపరచాడు. ఏకధాటిగా 2 గంటలు సేపు ప్రసంగం చేసేవాడు. "ఫాదర్ నాష్. ఫిన్నినీ ఎంతో ప్రోత్సహించేవాడు.

## ఈవెన్స్ మిల్స్‌లో ఉజ్జీవం

పరిచర్యకు తగినంత వేదాంత నభ్యసించనందున ఫిన్నీ పెద్ద సంఘాల్లో పట్టణాల్లో పరిచర్యకు వెళ్ళడం కంటె చిన్న గ్రామాల్లో, మిల్లులల్లో, ప్రాథమిక పాఠశాలల్లో వాక్యం ప్రకటించేందుకు ఎక్కువగా మొగ్గు చూపేవాడు.

ఈవెన్స్‌లో నున్న స్టోన్ స్కూల్ ఇంటిలో వాక్యం చెప్పసాగాడు. ప్రజలు చాల ఆసక్తి కనుపరచారు. ప్రసంగం చాల బాగుందనే వారేగాని ప్రభువును

అంగీకరించడం లేదు.

కొంత నిరుత్సాహానికి గురైనాడు ఫిన్నీ. ఒక సాయంకాలం మీరు సువార్తను వింటున్నారు. చాల సంతోషం. ఎందరు ప్రభువును అంగీకరిస్తున్నారో, మీ తీర్మానాలు చెప్పమని అడినప్పుడు ఎలాటి స్పందన రాలేదు. ప్రజలందరు వెళ్ళిపోయారు.

అక్కడే ఫిన్నీ, డీకన్ మాక్ బాప్టిస్టు సంఘంలో పరిచర్య చేస్తున్నాడు. ఆ రోజు మధ్యాహ్నం నుండి ఇద్దరు కలసి బహు భారంతో ప్రార్థించారు. ప్రభువు ఆత్మ మా మీద నిలిచింది. ప్రభువు అభయమిచ్చాడు.

మరునాడు సాయంత్రం ఫిన్నీ ప్రసంగ సభా స్థలి దగ్గరకు వేళ్ళే సరికి ప్రజలందరు కిక్కిరిసి ఉన్నారు. ఫిన్నీ లేచి, నీతిమంతులు తమ నీతి ఫలములు పొందుదురు. దుర్మార్గులు తమ దుర్మార్గపు క్రియలకు తగిన ఫలమును పొందుదురని చెప్పాడు. ఆయన తీర్పు ఆయన చేతిలో ఉన్నదని ప్రకటించాడు. గంటన్నర సేపు ఫిన్నీ ప్రసంగించాడు పరిశుద్ధాత్మ అగ్నివలె వారి మీదకు దిగివచ్చాడు. వాక్యం ప్రతి హృదయాన్ని చీల్చి వేస్తుంది. సభికులందరు ప్రభువును రక్షకునిగా అంగీకరించారు. గొప్ప మార్పు సంభవించింది.

ప్రతిరోజు ఫిన్నీ తన బసకు చేరుకునే దారిలో కొన్ని గృహాలను దర్శించేవాడు. ప్రజలు ఎంతో ఆత్మీయంగా నలిగిపోయి ఉండేవారు. వారిని దర్శించి వాక్యంతో బలపరిచేవారు. ప్రజలు ప్రభువును అంగీకరించి రక్షించబడేవారు. ప్రజలు ఉజ్జీవింపబడేవారు.

## జర్మనీ సెటిల్‌మెంట్ ప్రాంతంలో ఉజ్జీవం

ఈవెన్స్ మిల్స్ గ్రామానికి సమీపంలో జర్మనీ ప్రజల సెటిల్‌మెంట్ (కాలని) ఉన్నది. ఇక్కడ పేరుకు ఒక చర్చి ఉన్నది. అందులో సంఘ పెద్దలు, సంఘస్తులు చాల మంది ఉన్నారే తప్ప సంఘారాధనలు సంఘం పక్షంగ కూడికలు గాని మచ్చుకు ఒక్క కార్యక్రమమైనా జరగడం లేదు. పూర్తిగా నిర్లక్ష్యానికి గురియైన ప్రాంతం. అక్కడి సంఘ పెద్దలు ఫిన్నీని వాక్య పరిచర్యకు

ఆహ్వానించారు. మొదటి రోజు ప్రసంగ పాఠంలో 'పరిశుద్ధత లేకుండ ఎవరును ప్రభువును చూడలేరు' అంశాన్ని బోధించాడు.

ఒక బడిలో ప్రార్థనకు కూడికొనేవారు. ఆ రోజు ఆ బడి, హాలంత కిక్కిరిసి పోయింది. కొన్ని రోజుల్లోనే జర్మనీ సెటిల్‌మెంట్ ప్రాంతంలో అనేకులు కుప్పలు లెప్పలుగా ప్రభువును అంగీకరించారు. ఎన్నడు ప్రార్థన కూడికలకు హాజరుకాని వారు కూడ ప్రభువు వాక్యం విని ఆకర్షితులై ప్రభువును అంగీకరించారు. పరిశుద్ధాత్మ వారి మధ్యలో అద్భుతంగా పనిచేసి వారు పాపములు ఒప్పుకొని రక్షకుని చెంతకు చేరునట్లు చేశాడు. తీర్మానం చేసిన వారిని తిరిగి కలుసుకొనే ఏర్పాట్లు గావించాడు. దాదాపు జర్మనీ సెటిల్‌మెంట్ ప్రాంతంలో ఉన్నవారందరు ప్రభువును అంగీకరించారు. ఇంత గొప్ప మార్పు ఎన్నడు చూడలేదని ఫిన్నీ స్వగతంలో చెప్పాడు. ఈ ప్రాంతంలో పరిచర్యలో నిమగ్నమై యుండగానే ప్రెస్బిటరి చర్చివారు తనను "అభిషేకం" కొరకు పిలువనంపించారు. సంఘమంత ఏక గ్రీవంగా తీర్మానించి ఫిన్నీకి "అభిషేకం" చేశారు. గృహ కూడికలు నిర్వహిస్తు, ప్రజలను ఆత్మీయంగా చైతన్య పరచినందున గొప్ప ఉజ్జీవం చెలరేగింది.

సిద్ధాంతాల జోలికి పోకుండ ఫిన్నీ ఎప్పుడు కేవలం క్రీస్తు సువార్తను మాత్రమే బోధించేవాడు. సిద్ధాంతాలు గలిబిలి చేస్తాయే తప్ప ప్రజలను రక్షణ వైపు నడిపించలేవని ఫిన్నీ అభిప్రాయం. ప్రజల హృదయల్లో మార్పు రావాలంటే సువార్త ఒక్కటే అవసరమని ఫిన్నీ దృఢ అభిప్రాయం.

ఉజ్జీవం రావాలంటే ప్రార్థన ఒక్కటే మార్గమని ఫిన్నీ గ్రహించాడు. కనుక ఫిన్నీ ప్రార్థనకు అధిక ప్రాముఖ్యత నిచ్చేవాడు. ప్రభువు సిలువ కార్యము ప్రభువు రక్తం చిందించడం, రక్షణ ఏర్పాటు, మరణ పునరుత్థానాలను గూర్చి ప్రజలకు వివరించేవాడు. పరిశుద్ధాత్మ దేవుడు బలంగా ప్రజల హృదయాల్లో

పనిచేసి ప్రజలు మారుమనస్సు పొందునట్లు చేశాడు. ఆ ప్రాంతమంత ప్రజలు ఉజ్జీవంతో ఉర్రూత లూగిపోయారు. అన్వేషకులతో వ్యక్తిగతంగ మాట్లాడడం, కూడికలు జరపడం, వ్యక్తిగతంగ ప్రార్థనకు ప్రాధాన్యతనిస్తూ ఫిన్నీ పరిచర్యలో నిమగ్నమై యున్నారు. ఆరు నెలలో జర్మనీ సెటిల్‌మెంట్ ప్రాంతంలో ఫిన్నీ పరిచర్య గావించాడు. గుర్రం మీద గ్రామాలను దర్శిస్తు దాదాపుగా ఆ ప్రాంతమంత చిన్న పెద్ద పట్టణాలను గ్రామాలను అవిశ్రాంతగ తిరిగి ముమ్మర పరిచర్య గావించాడు. ఫిన్నీ పరిచర్యలో ఎంతో సంతోషిస్తుండగా ముందుకు వెళ్తుండగా, ఆకస్మాత్తుగా ఆయన ఆరోగ్యం క్షీణించింది. దగ్గు వచ్చినప్పుడు నోటి వెంట రక్తం పడుతుండేది. ఆడమ్స్‌లో డాక్టర్లు పరీక్షించి పూర్తిగా విశ్రాంతి అవసరమని చెప్పారు. రెవ. గేల్ గారు ఫిన్నీతో మాట్లాడి వారానికి అరగంట కంటె ఎక్కువ మాట్లాడదద్దని కోరాడు. ఫిన్నీ దీనిని లెక్క చేయక ఇంకా అలాగే గుర్రం మీద తిరుగుతు కనీసం 2 గంటలైనా

ఏక ధాటిగా మాట్లాడేవాడు. ప్రభువు అద్భుత రీతిగా ఫిన్నీని స్వస్థపరిచాడు. రోజుకు కనీసం $2^1/_2$ గంటలైనా ప్రసంగం చేసేవాడు. గృహ కూడికలు, అన్వేషకుల సభలు, ఉజ్జీవ సభలు నిర్విరామంగా జరిపేవాడు. ప్రజలు సభలకు తండోప తండాలుగా వచ్చేవారు. వారికి వాక్యం యెడల ఉన్న ఆసక్తిని గమనించి ఫిన్నీ పులకరించిపోయేవాడు.

అన్వేషకులకు సిద్ధాంతాలను గూర్చి ఒకసారి బోధించినప్పుడు అంతా గందరగోళంగా మారిపోయింది. వాటి కంటె విశ్వాసం, మారుమనస్సు, పాపక్షమాపణలను గూర్చి వివరించినప్పుడే ప్రజలు సావధానంగా అర్థం చేసుకోగలిగారు.

ఫిన్నీ తన పరిచర్య ప్రారంభ దినాల్లో తోటి సేవకులు, పాస్టర్ల నుండి తీవ్రమైన ఎదిరింపులు, తిరస్కారాలను ఎదుర్కొన్నాడు. ఎందుకంటె ఫిన్నీ భాష, వివరణ వారికి నచ్చేవి కావు. పాస్టర్లందరు ఎంతో ఉన్నత విద్యావంతులు. పండితులు. ఫిన్నీకి వేదాం

విజ్ఞానం అతి తక్కువ. సామాన్య ప్రజలకు అర్థమయ్యే రీతిగా స్థానిక ఉపమానాలతో ఫిన్నీ బోధించేవాడు. ఈ తీరు పాస్టర్ల వేదాంత విజ్ఞానానికి సరిపోయేది కాదు. పాస్టర్ల ఉన్నత విద్యా విజ్ఞానం ప్రజలను ప్రభువు దగ్గరకు నడిపించడం లేదు. ఫిన్నీ సామాన్య ప్రజల నుండి వారుపయోగించే సామితలతో ప్రజలు వాక్యాన్ని చక్కగా అర్థం చేసుకొనేవారు. ఫిన్నీ పెరిగిన గ్రామ వాతావరణ, చదువుకున్న గ్రామ భాష తీరు తెన్నులు చాల భిన్నంగా ఉండేవి. ఇప్పుడేమో ప్రసంగాలు చేయాలంటే "మంచి భాష" భిన్నంగా ఉంటుంది. తన ఆలోచనా సరళిని ఆకళింపు చేసుకుంటు క్రమ పరచుకుంటు వీలైనంతగా అందరికి అర్థమయ్యే రీతిలో ప్రసంగం చేసేవాడు.

అపార అనుభవం కలిగేకొలది ప్రసంగించే తీరులో కొంత ప్రావీణ్యం అనుభవం కలుగడం వలన మంచి ఫలితాలు వస్తుండేవి. సామాన్యులను, విద్యావంతులను కలుసుకొనేవాడు. ఇవన్నీ కూడ నేను ప్రభువు దగ్గర నేర్చుకున్నాను. ఫిన్నీ ఆత్మల సంపాదన అపొ.పౌలు పరిచర్య మాదిరిగా ఉండేది. సాటి సేవకులతో మాట్లాడడంలో నేర్పరితనాన్ని ప్రభువు నాకు అనుగ్రహించాడు. క్రమంగా ఫిన్నీతో సాటిగా మాట్లాడగలిగే వారే లేరంటే అతిశయోక్తి కాదు గదా!

ఫిన్నీ కాలంలో కాపరులకు వేదాంత విద్యలో ఎన్నో విషయాలు నేర్పేవారు. వారికి సదుపాయాలు ఉండేవి. చారిత్రక విశేషాలు బైబిలు సత్యాలు, వేదాంత విజ్ఞానం సముపార్జించే వారు. అయితే అంత విజ్ఞానాన్ని ఆత్మల సంపాదనలో ఏ రీతిగా ఉపయోగించుకోవాలో వారికి అర్థమయ్యేదికాదు. దావీదు సౌలు సైనిక దుస్తులు ధరించుకొని యుద్ధానికి వెళ్లలేని స్థితి లాగ పాస్టర్ల పరిస్థితి ఉండేది.

ఫిన్నీ తన ప్రసంగాలను మోకాళ్ళమీద ప్రార్థనలో ఉంటే ప్రభువు అంశాలను అనుగ్రహించేవాడు. ఆ ప్రసంగాలను నెమ్మదిగా తయారు చేసికొని వాటిని అర్థం చేసుకుని, అవి తన శరీరంలోకి ఎక్కి పూర్తిగా ఒక కంకాళంగా మారిపోయినట్లు ఉండేవి. మనస్సు, హృదయం,

ఆత్మలోనికి ఆ ప్రసంగాలు తనకు ఎక్కేవి. అటువంటి ప్రసంగాలను అర్థం చేసుకొంటే తాను ముందుగా వణికిపోయేవాడు. ఆ ప్రసంగాలను ప్రజలకు బోధిస్తే ప్రజల హృదయాల్లో నాటుకుపోయేవి.

ఫిన్నీ ప్రసంగాలకు, తోటి పాస్టర్ల ప్రసంగాలకు చాల తేడాలుండేవి. సేవకులందరు ప్రభువును గూర్చే ప్రకటించాలి "ఆ ప్రసంగాలు పరిశుద్ధాత్మ దేవుడు పరమునుండి అనుగ్రహించి ఉండాలి" అప్పుడే ప్రసంగాలు తగిన ఫలితాలను తీసుకొచ్చేవని ఫిన్నీ భావించేవాడు. ఆ ప్రసంగాల్లో ప్రభువు తనను తాను బహిరంగ పరచుకుంటాడు.

## నార్త్ ఈవెన్స్ మిల్స్‌లో ఉజ్జీవం

ఫిన్నీ పరచర్యలో కొన్ని సంఘటనలను తెలుసుకోవాలి. నార్త్ ఈవెన్స్ మిల్స్‌లో ఆంట్‌వెర్ప్ అనే గ్రామాన్ని దర్శించాడు. ఏప్రిల్‌లో గ్రామాన్ని దర్శించినప్పుడు అక్కడ చాల యెత్తున అపవిత్ర కార్యక్రమాలు జరగడం చూచాడు. ఎంతో హృదయ భారంతో ఫిన్నీ ప్రార్థించినప్పుడు, "భయపడకు, ధైర్యంగా మాట్లాడు, నా సమాధానం నీకు తోడైయుంటుంది. నీకు కీడు చేసే వారెవరు ఉండరు. ఈ పట్టణంలో నాకుచాల మంది ఉన్నారని" ప్రభువు నాతో మాట్లాడాడు. సబ్బాతు దినం ఉదయాన్నే ఫిన్నీ లేచి లాడ్జిలో ఒంటరిగా ఉండి బిగ్గరగా ప్రార్థిస్తున్నాడు. అక్కడ నుండి ఫిన్నీ దగ్గరలోనే వున్న అడవిలోకి వెళ్ళి తన హృదయ భారం తీరేంత వరకు బిగ్గరగా ప్రార్థించాడు. అయినా ధైర్యం చాలలేదు. మరలా రెండవ సారి అడవిలోకి వెళ్ళి ప్రార్థించాడు. అయినా ధైర్యం చాలలేదు. తిరిగి మూడవ సారి అడవిలోకి వెళ్ళి ప్రార్థించాడు. అప్పుడు ప్రార్థనకు జవాబు వచ్చింది.

వెంటనే సబ్బాతు రోజు ప్రార్థన సమయానికి స్కూలు దగ్గరకు వెళ్లాడు. ఆ బడి ప్రజలతో క్రిక్కిరి పోయి ఉన్నది. ఫిన్నీ ముందుకు వెళ్లి, తన దగ్గర నున్న బైబిలు తీసికొని "దేవుడు లోకమును ఎంతో ప్రేమించెను. కాగా ఆయన తన అద్వితీయ

కుమారునిగా పుట్టిన వానియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్యజీవము పొందునట్లు ఆయనను అనుగ్రహించెను" (యోహాను 3:16) ఆ వాక్య భాగం వివరిస్తు తన హృదయాన్ని కన్నీళ్లను కుమ్మరించాడు. ఆరోజు ప్రసంగం ప్రజలను నిశ్చేష్టులను చేసింది. ఎన్నడు అటువంటి వాక్య భావాలను ప్రజలు విని ఎరుగరు. ప్రజలు వాక్యానికి అతుక్కుపోయారు. వాక్యం వారి హృదయాల్లో చొచ్చి, వారిని ప్రభువు వైపు మరల్చింది. అనేకులు బిగ్గరగా ఏడుస్తూ తమ పాపాలను ఒప్పుకొని అనేకులు రక్షింపబడ్డారు.

ఉజ్జీవం వ్యాప్తి చెందింది. చాల దూరంలో నున్న బ్రౌన్ వెల్లి పట్టణం నుండి ప్రజలు సభలకు వచ్చేవారు. ప్రజల్లో మారుమనస్సు, పాప క్షమాపణ ఒప్పుదల జరిగి అనేకులు రక్షింపబడ్డారు.

బ్రౌన్ వెల్లిలో ప్రసంగం కొరకు వెళ్ళినప్పుడు ప్రభువు తాను చేయబోయే కార్యాన్ని చూపించాడు.

గవర్నర్ ప్రాంతంలో పరిశుద్ధాత్మ కుమ్మరింపు చేసి ప్రభువు ఉజ్జీవాన్ని కలిగిస్తాడని ప్రభువు నాకు చూపించాడు. గవర్నర్ ప్రాంతానికి వెళ్ళు ఇదే మంచి సమయమని ప్రభువు సెలవిచ్చాడు. నాతో కలసి పరిచర్య చేయడానికి బ్రదర్. నాష్ వచ్చారు. నాష్‌తో మీరు వెళ్ళి గవర్నర్ ప్రాంత పరిస్థితులను గమనించి, వచ్చి నాకు చెప్పమని కోరాను.

బ్రదర్. నాష్ 2,3 రోజులు అక్కడే ఉండి వచ్చి నాతో చెప్పిన విషయాలు అక్కడ చాల మంది మత పండితులు, ఉన్నత విద్యావంతులున్నారని చెప్పాడు. అక్కడే కూడిక ఏర్పాట్లు చేయమని కోరాను.

ప్రార్థనా కూడిక రోజు అక్కడకు వెళ్లేసరికి హాలంత ప్రజలతో క్రిక్కిరిసిపోయి ఉన్నది. ప్రజలకు నన్ను గూర్చి ముందుగానే కొంత సమాచారం చెప్పబడింది. నేనులేచి ప్రసంగ వేదికను ఎక్కి ప్రార్థనా పూర్వకంగా ప్రసంగం మొదలుపెట్టాను. ప్రజల్లో ఉజ్జీవం ఉరకలేసింది. ప్రజలు బిగ్గరగా ఏడుస్తు,

పాపక్షమాపణ పొందుతూ, ప్రభువువైపు వచ్చారు. ఇదంత గమనించి అక్కడి ఒక సంఘం వారు నన్ను వ్యతిరేకించారు. వారితో కొందరు యౌవనస్తులు కలుసుకొని నన్ను తీవ్రంగా వ్యతిరేకించారు. బ్రదర్ నాష్ వారందరిని ఎంతో మర్యాదగా అనునయించాడు. వారు మాకు ఆపద తలపెట్టియున్నాను. ఫిన్నీ ప్రసంగం ముగిస్తు యౌవనులారా నా వైపు చూడండి. దేవుడు మీ ప్రయత్నాలను వమ్ము చేస్తాడు. అతి త్వరలోనే మీరు నరకంలో ప్రవేశించబోతున్నారని హెచ్చరించాడు.

మంగళవారం ఉదయాన్నే వారిలో నాయకుడైన యౌవనస్తుడు ఫిన్నీ దగ్గరకు వచ్చి, ఈ వారమంత చాల గందర గోళానికి గురైనాను. మనస్సులో నెమ్మది లేదు. చనిపోతే నరకానికి నరకానికి వెళ్తానని భయం పట్టుకున్నదని ఫిన్నీ దగ్గరకు వెళ్లగా వారందరిని ప్రార్థన కూడికకు రమ్మని చెప్పమని పంపించాడు. ఒక వారం లోపల ఆ యౌవనులందరు ప్రభువును రక్షకునిగా అంగీకరించి క్రీస్తును వెంబడించారు.

అక్కడ ఎందరు ప్రభువును అంగీకరించారో చెప్పలేదు గాని గవర్నర్ ప్రాంతంలో చాల మంది ప్రభువును అంగీకరించారు. ఉజ్జీవం చెలరేగింది. కూడికలు, ప్రార్థనలు ముమ్మరంగా జరగడం జరిగింది.

## రోమ్‌లో ఉజ్జీవం

రెవ. మోజస్ గిలెట్‌గారు ఫిన్నీని రోమ్ నగరానికి ఆహ్వానించారు. ఓ ఆదివారం అతడు అక్కడ మూడుసార్లు ప్రసంగించాడు. 'శరీరానుసారమైన మనస్సు దేవునికి విరోధమైనది' అన్నది అతడు ఎన్నుకొన్న అంశము. ప్రభుని గురించి వివరంగా తెలుసుకోవాలనుకొనేవారు సంఘ పరిచారకుడి ఇంటికి రావలసిందని ఫిన్నీ ప్రార్థన కూటం ముగింపులో ఆహ్వానించాడు. ఆ ఇల్లు మంచి పేరు ప్రఖ్యాతులు, పలుకుబడి వున్న యువకులతో నిండిపోయింది. ఫిన్నీ క్రీస్తును రక్షకుడిగా చూపిస్తూ పరిశుద్ధాత్మ శక్తితో బాగా బోధించాడు. దేవుడి వాక్యం బలంగా పనిచేసింది. వారంతా దేవుని సన్నిధిలో తమ్మును తాము

తగ్గించుకొని, కృంగిపోయారు. ప్రార్ధించడానికి మోకరించారు. అందాక దాగివున్న పాపం వాళ్ల కళ్ళ యెదుటనే కనిపిందింది స్పష్టంగా, ప్రార్ధన ముగించి లేచేసరికి, వాళ్లంతా ఏడుస్తూ కన్నీళ్ళతో కనిపించారు. ఒక యువకుడు తన ఇంటికి వెళ్ళి తలుపు వేసికొని తన పాప స్థితిని జ్ఞాపకం చేసుకొని, నేలపై పడి రోధించడం మొదలు పెట్టాడు. అది విని కుటుంబములోని సభ్యులందరూ హడావిడిగా పరుగులు తీస్తూ వచ్చారు. వారిపట్ల కూడా పరిశుద్ధాత్ముడు క్రియ జరిగించాడు. వారు కూడా పశ్చాత్తాపపడి క్రీస్తును అంగీకరించారు. ఫిన్నీ చాలా కుటుంబాలను దర్శించేవాడు. కొంతమంది మోకరించి ప్రార్ధిస్తే, మరి కొందరు సాష్టాంగపడి ప్రార్ధించేవారు, ఒక హోటలు గదిలో కూడిక ఏర్పాటు చేశారు. స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలతో ఆ గది నిండిపోయింది. ఒంటిగంటకు ప్రారంభమైన ఆ కూటం రాత్రి పొద్దుపోయిందాకా జరిగింది. తద్వారా పట్టణమంతట్లో ఉజ్జీవం వ్యాపించింది. ఆదివారం రెండుసార్లు, తక్కిన దినాల్లో రోజుకు ఒకసారి ఫిన్నీ బోధించాడు. సమీప నగరాల నుండి సేవకులు వచ్చి జరిగిన పనిని చూచి ఆశ్చర్యపోయారు. మార్చబడిన విశ్వాసుల సంఖ్య రోజు రోజుకు అధికం అయ్యింది.

## అబర్న్‌లో ఉజ్జీవం

డాక్టర్ లెన్సింగ్ ఆబర్న్ అనే సంస్థలో ప్రెస్బిటేరియన్ సంఘకాపరి. అతడు 'యుటికా'కు వచ్చి కొంతకాలం తనతో కలసి పనిచేయవలసిందిగా ఫిన్నీని కోరాడు. 1826లో ఫిన్నీ ఆబర్న్‌కు వెళ్లాడు. కొన్ని రోజులు గడిచాక అక్కడ వేదాంత కళాశాల పండితులు, మరికొందరు ఫిన్నీ విషయం చెడుగా విని, అతడి పరిచర్యను ఆటంక పరచడానికి పూనుకొన్నారు. ఆ పరిస్థితి చక్కబడేట్టు ఫిన్ని బాహుగా ప్రార్థనలో గడిపాడు. అతడికో దర్శనం కలిగింది. ప్రభువు దర్శిస్తే సీనాయి పర్వతంపై ఉరుములు మెరుపులు చూచి ప్రజలు వణికినట్టుగా ఫిన్నీ వణికిపోయాడు. అతడు, దేవుడి ఎదుట ఎంతో తగ్గించుకున్నాడు. అప్పుడు నేను

'నీకు తోడై యుంటాను. నిన్ను లేవనెత్తు తాను. ఏ ఆటంకం నీ ముందు నిలవలేదు. ఆ వాగ్దాన ఫలితంగా గొప్ప ఉజ్జీవం అక్కడ ప్రజ్వరిల్లింది. ఆబర్న్‌లో ఒక వర్తకుడుంటేవాడు అతడికి ఉజ్జీవం అంటే పరమ ద్వేషం. అతడి భార్య క్రైస్తవురాలు. ఆమెను ఫిన్నీ ప్రార్థన కుటాలను వెళ్ళనిచ్చేవాడు కాదు. ఆరాధన గంటమ్రోగింది. అర్థగంట సేపు ఆమెఇంట్లో ప్రార్థనకు మోకరించింది. అంతలో భర్తకూడా వచ్చాడు. 'ఈరోజు నీతోపాటే నేనూ ప్రార్థనకు వస్తా'నన్నాడు. అక్కడి పరిస్థితులు గమనించి తన భార్యను ప్రార్థనకు రాకుండా చేయడానికి తగిన కారణం చూపాలని అతడి ఆలోచన. ఆరాత్రి ప్రసంగం మొదలైంది. 'క్రీస్తూ! నీతో నాకేం పని?' అన్న అపవిత్రాత్మ పట్టినవాడి మాటపై సాగుతోంది ప్రసంగం. పాపుల ప్రవర్తనను ఫిన్నీ విశదీకరిస్తోంటే విన్న ఆ వర్తకుడు గట్టిగా రోదిస్తూ క్రింద పడ్డాడు. ప్రసంగానికి అంతరాయం కలిగింది. అతడు పసిపిల్లవాడిగా ఏడుస్తూ పాపాల్ని ఓప్పుకున్నాడు. తనను తాను నిందించుకున్నాడు. సంఘస్థులంతా కన్నీళ్ళతో అతడి కోసం ప్రార్థించారు. అతడు వినయశీలుడై దైవ సేవలో సహాయపడ్డాడు. సత్ క్రైస్తవుడిగా జీవించాడు.

డా॥ లెన్‌సింగ్ సంఘస్థులు రక్షింపబడని వాళ్లు, వారి వస్త్రధారణ, నకిలీ నాగరికత విపరీతంగా ఉంటాయి. ఒక ఆదివారం ఫిన్నీ అక్కడ ప్రసంగించడానికి వెళ్లాడు. 'పట్టణాలలో ఉజ్జీవం కలగక పోవడానికి సంఘస్థులే కారణం అనీ, వారిలో లౌకికత్వం బాగా పాతుకుపోయిందనీ, వారి వస్త్రధారణ, ప్రవర్తనను బట్టి వారు క్రీస్తులో వారో, లోకస్థులో తెలుసుకోవచ్చుని' ఫిన్నీ ప్రసంగించాడు. ఈ మాటలు ప్రజల హృదయల్లో చొచ్చుకుపోయాయి. సంఘస్థులంతా తలలువంచుకొని కన్నీళ్లు కారుస్తూ తమ వెనుకబడిన స్థితిని గురించి పశ్చాత్తాప పడ్డారు.

## అనేక చోట్ల ఉజ్జీవం

1827లో న్యూ లెబనాన్‌లో జరిగిన మహాసభలో ఫిన్నీ వాక్యం బోధించాడు. అక్కడ ప్రతి

ఒక్కరు పవిత్రమైన, గొప్ప ఉజ్జీవాన్ని అనుభవించాడు. మహాసభ తరువాత ఒక ఆదివారం ప్రసంగానంతరం ఒక యువతి ఫిన్నీకి పరిచయం అయింది. ఆమె 'స్టీఫెన్ టౌన్' నుండి వచ్చింది. తమ పట్టణానికి వచ్చి బోధించమని ఆమె ఫిన్నీని కోరింది. కార్యక్రమాలు ఎక్కువగా ఉండటం వల్ల వెంటనే ఒప్పుకోలేదు. కాని తరువాత వీలుచేసుకొని వెళ్లాడు. ఆరాధనలో దైవాత్మ కుమ్మరించబడింది. ప్రార్థనా శక్తి ప్రత్యక్షమై అన్ని దిక్కులా వ్యాప్తిస్తోంటే, ప్రభువును ఎదిరించే వాళ్ళు కూడా, శక్తిహీనులై ఆ ప్రభావానికి లొంగిపోయారు. చాలమంది క్రీస్తును అంగీకరించారు.

రెవ॥ పీటర్‌సన్ ఆహ్వానంపై ఫిలిఢెల్ఫియాకు వెళ్లాడు ఫిన్నీ. అక్కడ కూడా గొప్ప సేవ జరిగింది. ఒక స్త్రీ ప్రభువును అంగీకరించింది. ఆమె భర్త ఆమెను ఆరాధనకు వెళ్ళరాదని ఆజ్ఞాపించాడు. ఒక ఆదివారం సాయంకాలం ఆరాధనకు ఆమె వెళ్లి తిరిగి వస్తోంది. ఆమె భర్త కోపంతో రెచ్చిపోయి ఒక చాకు తీసుకుని ఆమెను చంపడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆమె ఇంటికి రాగానే అతడు కత్తి తీసుకుని వెంటపబడ్డాడు. ఆమె ప్రాణభయంతో ఒక గదిలో నుంచి మరొక గదిలోకి పారిపోయింది. కాని, చివరకు ఎటూ తప్పించుకోలేని గదిలో చిక్కుకుపోయింది. వెంటనే మోకరించి, చేతులు పైకెత్తి తనపై, తన భర్తపై కనికరం చూపమని దేవుణ్ణి ప్రార్థించింది అంతే! అతడు ఎత్తిన కత్తిని దేవుడు బంధించి వేశాడు. ఆమెతల ఎత్తి అతణ్ణి చూసింది. ఆ కత్తిని అతడు నేలపై జారవిడిచాడు. తన తప్పిదాన్ని ఒప్పుకొని అటు దేవుణ్ణి, ఇటు భార్యను క్షమాపణ కోరాడు. తరువాత ఆ దంపతులిద్దరూ క్రీస్తులో ఆనంద జీవితాన్ని అనుభవించారు.

1830లో ఫిన్నీ ఆబర్న్ వచ్చినప్పుడు వీరు ఆయన్ను కలుసుకొని తమ చుట్టూ 80 మైళ్ళ వరకు ఉన్న ప్రాంతాల నుండి దాదాపు ఐదువేల మంది రక్షింపబడినట్లుగా ఆయనతో చెప్పారు.

రీడింగ్ అనే ఊళ్లో ఫిన్నీ పరిచర్య చేస్తున్నాడు.

అప్పుడు బాగా మంచు కురుస్తోంది. అయినా జనం విపరీతంగా వచ్చారు. 'మిమ్మల్ని మీరు ప్రభువుకు సమర్పించుకోండి, మోకాళ్ళపై ఉండి ప్రార్థించండి' అని ఫిన్నీ వాళ్లను కోరాడు. అందరూ పశ్చాత్తాపంతో ఏడుస్తూ ప్రార్థించారు.

మంచు కురిసే ఆ రాత్రి మంచి దేహపుష్టిగల ఒక కుర్రాడు ప్రార్థనకువచ్చాడు. ఆ రాత్రి సందేశం అతడ్ని బాగా నలగగొట్టింది. భారమైన హృదయంతో అతడు ఇంటికి వెళ్లాడు. బాగా నీరసించి అంతకంతకు శక్తిలేనివాడై పోయాడు. అది చూచి ఫిన్నీకి కబురు పెట్టారు తల్లిదండ్రులు. ఫిన్నీ వచ్చేసరికి అతడు బాధతో మెలికలు తిరిగిపోతున్నాడు. అతడి భార్య అతడికి చేయూతనిచ్చే ప్రయత్నంలో ఉంది. అతడు పండ్లు కొరుకుతున్నాడు. నాలుక కరచుకొంటున్నాడు. 'ఫిన్నీ! నేను నశించిపోయా' అని అరిచాడు. ఫిన్నీ అతడికి దగ్గరగా వచ్చి, రక్షణ మార్గం తెలిపి ప్రార్థించాడు. అతడి భారం, వేదన తొలగిపోయింది. ప్రభువు పట్ల ఆయన అనుగ్రహించే రక్షణ పట్ల నమ్మకం కుదిరింది.

## ఉజ్జీవ కరమైన సేవలో ముందడుగు

1920 వేసవిలో ఫిన్నీ 'కొలంబియా', 'వైట్ స్టోన్' న్యూయార్క్ నగరాల్లో బోధించాడు. అక్కడ గొప్ప ఉజ్జీవం కలిగింది.

ఒక అమ్మాయి పశ్చాత్తాప హృదయంతో ఫిన్నీ దగ్గరికి వచ్చింది. ఆమె బాల్యం నుండి దొంగతనం చేయడానికి అలవాటుపడింది. తన తోటి వారి నుండి చేతి రుమాళ్ళు, పెన్సిళ్లు దొంగిలించేది. వాటి విషయం ఇప్పుడేం చేయాలి? అన్ని ఫిన్నీని ప్రశ్నించింది. 'ఎవరి వస్తువులు వారికి ఇచ్చివేసి తప్పిదం ఒప్పుకో' అని ఫిన్నీ సలహా ఇచ్చాడు. ఆమె ఆ ప్రకారంగానే చేసింది. ఆమెలో నిజమైన క్రైస్తవ ప్రేమ, పశ్చాత్తాపం, ఆనందం కనిపించింది.

న్యూయార్కు విడిచిన తరువాత కొంతకాలం వైట్‌స్టోన్‌లో గడిపాడు ఫిన్నీ. తరువాత రోచస్టర్ నుండి ఆహ్వానం వచ్చింది. అక్కడి మెథడిస్టు విశ్వాసంలో

క్షీణించి పోయారు. అట్టి పరిస్థితుల్లో ఫిన్నీ ద్వారా స్త్రీ పురుషులు చాల మంది రక్షింపబడ్డారు. అక్కడ గొప్ప కదలిక వచ్చింది. 12,000 మంది సంఘంలో చేర్చబడ్డారు. 1800-1830 మధ్య కాలంలో ప్రెస్బిటేరియన్ సంఘస్థులు 40,000 నుండి 3,13,138 వరకు అంటే మూడు రెట్లు, మెథడిస్టు వారు 64,000 నుండి 4,76,153 వరకు, అంటే నాలుగు రెట్లు ఇంకా ఇతర సంఘాల వారు అదే నిష్పత్తిలో పెరిగిపోయారు. 1850 నాటికి ప్రెస్బిటేరియన్లు 4,27,991, బాప్టిస్టులు 8,15,212, మెథడిస్టులు 13,26,631 వరకు పెరిగారు. ఈ ఉజ్జీవం 1500 పట్టణాలు, గ్రామాల వరకు విస్తరించింది.

ఫిన్నీ నిర్విరామంగా సేవ చేయడం వల్ల బాగా అలసిపోయాడు. కనెక్టికట్ విద్యార్థుల మధ్య సేవచేయడానికి పిలుపు వచ్చింది. జెనీవా చేరేటప్పుడు అతడితో డాక్టర్ విన్నర్ వచ్చి విశ్రాంతి తీసుకోమని చెప్పాడు. ఫిన్నీ ఒప్పుకోలేదు. అప్పుడు డాక్టరు 'నీవు ఇక మీదట ఉజ్జీవ సభల్లో పనిచేయకూడదు' అని హెచ్చరించాడు. కాని ఫిన్నీ ఆయన మాటలు పట్టించుకోలేదు. తాను కాస్త అలసిపోయినట్టు, విశ్రాంతి తీసుకొంటే తిరిగి ఆరోగ్యం లభిస్తుందని బదులు చెప్పాడు.

తరువాత ఆబర్న్ చేరుకుని కొన్ని రోజులు విశ్రాంతి తీసుకున్నాడు. 1826లో ఉజ్జీవం విషయంలో అభిప్రాయం భేదాలు వచ్చి వేరే సంఘంగా ఏర్పడ్డ కొందరు కొంతకాలం తమ మధ్య ఉండవలసిందిగా ఫిన్నీకి కబురంపారు. క్రిందటిసారి ఉజ్జీవంలో తీవ్రమైన అభ్యంతరం కలిగించిన వ్యక్తి క్రీస్తును అంగీకరించడానికి ముందుకు వచ్చాడు. అక్కడి పాస్టరుకు, సంఘస్థులకు, ఫిన్నీకి కూడా చాలా ఆశ్చర్యం వేసింది.

## సంఘకాపరి సేవలో ఉజ్జీవం

### సినిమాహాలు దేవుని మందిరంగా మారడం

ఫిన్నీ గనుక న్యూయార్కు వచ్చినట్లయితే,

అక్కడ జనసమర్థంగా వున్న చన్‌మత్ వీధిలో ఒక సినిమా హాలును తీసుకొని దేవాలయంగా నిర్మించవచ్చని కొందరు సహోదరులు ఆయనకు వ్రాసారు. అంచేత 1832 ఏప్రిల్‌లో బోస్టన్ విడిచి ఆ సినిమా హాలు స్థలంలో సంఘకాపరిగా వెళ్లాడు. రోజు రోజుకు సంఘం అభివృద్ధి కాసాగింది. ఫిన్నీ న్యూయార్కు తిరిగి వచ్చి అక్కడ సంఘకాపరిగా సేవచేసి గొప్ప ఉజ్జీవాన్ని కలిగించాడు.

## న్యూయార్క్ సువార్తీకరణ పత్రిక

న్యూయార్క్ 'ఇవాంజిలిష్టు' పత్రిక సంపాదకుడు లీవిట్ వచ్చి 'పత్రిక నాశనం అయ్యింది. దాన్ని పైకి తేవడానికి సహాయపడు'మని ఫిన్నీని కోరాడు. ఫిన్నీ ఆ విషయం ప్రార్థించాడు. దానికి ప్రతివారం ఒక పెద్ద ఉపన్యాసం వ్రాసి పంపేవాడు. ఫిన్నీ, తరువాత ఫిన్నీ ఉజ్జీవ ఉపన్యాసాలు, అనే పుస్తకం ప్రచురించారు. ఈ ఉపన్యాసాలు, అనే పుస్తకం ప్రచురించారు. ఈ ఉపన్యాసాలు ఇంగ్లాండ్, స్కాట్లాంటడ్, వేల్సు, ఐరోపా, తూర్పు, పశ్చిమ కెనడా, నోవస్కాషియా సముద్ర ద్వీపాలలో ఉజ్జీవాన్ని పెంపొందించడానికి ఎంతగానో తోడ్పడ్డాడు.

1836 జనవరిలో బర్లెన్ వేదాంత కళాశాలలో ఆచార్యునిగా పనిచేయవలసిందిగా ఫిన్నీకి ఆహ్వానం అందింది. ఫిన్నీ దానికి అంగీకరించి, అక్కడ వేదాంత విద్య నేర్పించాడు. 'సంపూర్ణ పరిశుద్ధత' అన్న అంశంపై ధారావాహికంగా కొన్ని ఉపన్యాసాలు ఇచ్చాడు. అక్కడ గొప్ప ఉజ్జీవం కలిగింది.

ఒక శీతాకాలం కానుకల పండుగ వచ్చింది. ఇంట్లో ఏమి లేవు. తన అవసరాలన్నీ గుర్తించి, దేవుడు జోషియా చాప్లిన్ ద్వారా 200 డాలర్లు పంపించాడు. 1837 నుండి 72 వరకు అంటే 45 సం॥ నుండి 80వ సం॥ వరకు ఓబర్లిన్ 'ఫస్టకాంగ్రిగేషనల్' అనే సంఘానికి కాపరిగా పనిచేశాడు. అంతేకాదు 1851 నుండి 67 వరకు కళాశాల అధ్యక్షునిగా కూడా పనిచేశాడు. వెయ్యిమందికి సరిపడే పెద్ద ఆలయం నిర్మించబడింది. 1846లో 'సిస్టమాటిక్ థియాలజీ'

ప్రచురించబడింది. విద్యార్థులెందరో మార్పు చెందారు. పలు ప్రాంతాలకు మిషనరీగా బయలుదేరి వెళ్ళారు.

## రెండవసారి ఇంగ్లాండుకు పయనం

1958 డిసెంబర్‌లో లివర్‌పూల్ నుండి పెర్షియా అనే ఓడలో బయల్దేరాను. మా మిత్రుడు బ్రౌన్ మా దగ్గరకు వచ్చాడు. హ్యాగ్‌టన్ నగరంలో ఆ ఋతువులో పరిచర్యగావించాడు. అక్కడ ఉన్నప్పుడే వివిధ ప్రదేశాల నుండి ఫిన్నీకి ఆహ్వానాలు కుప్పలు తెప్పలుగా చేరాయి. ప్రజలు ఆత్మీయ ఆహారం కోసం ఎదురుచూస్తూ ఉన్నారు. ఫిన్నీ ఏ స్థితిలో ప్రార్థనా కూడిక ఏర్పాటు చేసిన, అక్కడ పరిశుద్ధాత్మ కుమ్మరింపు, ఉజ్జీవం పరవళ్ళు త్రొక్కేవి. హ్యాగ్‌టన్‌లో చాలా వారాలు పరిచర్య చేశాడు. సెయింట్ ఐవీస్ నుండి ఆహ్వానం అందింది. అక్కడ ఎన్నడు ఉజ్జీవ గాలి కూడ సోకలేదు.

బ్రదర్. హార్ కోర్డ్ హ్యాగ్‌టన్‌లో పాస్టరు ఎంతో జయప్రదంగా పరిచర్య చేసివాడు. లండన్‌లో బోరో రోడ్‌లో చిన్న ఆలయం ఉన్నది. సెయింట్. ఐవీస్ నుండి లండన్‌లో ఆ స్థలానికి చేరుకున్నాడు. అక్కడ పరిచర్య చేసిన దినాల్లో ఉజ్జీవం పరవళ్ళు త్రొక్కింది. అనేకమంది ప్రజలు ప్రభువు వైపు తిరిగారు. ఈ విషయం చుట్టప్రక్కల నగరాలకు ప్రాకినందున దూర ప్రాంతాల నుండి కూడ ప్రజలు సభలకు వచ్చేవారు.

బారో రోడ్ ఆలయంలో పరిచర్య ముగించుకొని ఫిన్నీ హ్యాగ్‌టన్‌లో కొంత విశ్రాంతి కొరకు ఫిన్నీ అగిపోయాడు. ఫిన్నీ ఆరోగ్యం క్షీణిస్తున్నది. అవిశ్రాంత ప్రయాణం, ప్రసంగాలు శారీరక దౌర్బల్యానికి గురిచేసాయి. డాక్టర్ యఫ్... హ్యాగ్‌టన్‌లో మంచి పేరున్న క్రైస్తవ డాక్టరు. ఫిన్నీ డాక్టరు దగ్గర ఉన్నప్పటికి మందులు మాకులు వాడకుండనే స్వస్థత చేకూరింది. తిరిగి ప్రసంగించడానికి ఆరోగ్యం కుదుటపడింది. హాంటరిగ్‌లో ఉజ్జీవం పరవళ్ళు త్రొక్కింది. ప్రజలు మారు మనస్సు పొంది రక్షింపబడుచున్నారు.

హ్యాగ్టన్‌లో మత నాయకులు, విద్యావంతులు అనేకులు రక్షింపబడ్డారు.

ఫిన్నీ లండన్‌లో ఉన్నప్పుడు స్కాట్‌లాండ్ ఎడిన్‌బర్గ్ నుండి అత్యవసరంగా రమ్మని కబురంపింది. జర్మనీ సముద్రం ద్వారా ఓడలో ఎడిన్ బర్గ్ చేరుకున్నాడు. రెవ. డా. కిర్క్ ఫిన్నీని ఆహ్వానించారు.

ఎడిన్‌బర్గ్‌లో డా. కిర్క్ ఆలయం చాలా పెద్దది. అందులో బాల్కనీ కూడ ఉన్నది. ప్రజలు క్రిక్కిరిసి పోయారు. అనేకులు తమ పాపాలను ఒప్పుకొని రక్షింపబడ్డారు.

ఒకసారి ఫిన్నీ ప్రసంగిస్తుంటే, హాన్‌టింగ్ టిన్‌లో ఒకరు లేచి, "నేను దోపిడి దొంగను" అని కేకవేసి పశ్చాత్తాప పడినారు. మరొకడు లేచి నేను 15 వందల పౌండ్లను మా సోదరుడి నుండి తీసుకున్నాను, అని తిరిగి ఇచ్చివేశాడు. అనేక అద్భుతాలు చోటు చేసుకున్నాయి. ఎడిన్ బర్గ్‌లో మూడు మాసాలు ఉండి ఫిన్నీ గొప్ప పరిచర్య చేశాడు.

## సొంత ఇంట్లో చివరి గడియాలు

1860లో అంటే అతడి 69వ యేట కూడ తూర్పు దేశాల నుండి పశ్చిమ దేశాల నుండి ఎన్నో ఆహ్వానాలు వచ్చాయి. కాని ఆయన వాటిని అంగీకరింపలేక పోయాడు. 1868లో తన జీవితచరిత్ర వ్రాసి పూర్తిచేశాడు. 1866 అధ్యక్షపదవి నుండి విరమించుకొన్నా 1872 వరకు వేదాంత కళాశాలలో బోధించాడు. ఆ సంవత్సరమే బోధకుడిగా విరమించుకున్నాడు. 1824లో ఫిన్నీ వివాహం చేసికొన్నాడు. భార్య లిడియా ఆండ్రూస్. ఆమె 24 యేండ్లు పరిచర్య చేసి 1847లో మరణించింది. ఆ తరువాత 1848లో ఎలిజబెత్ ఆకిన్‌సన్‌ను పెండ్లి చేసికొన్నాడు. ఆమె 16 సంవత్సరాలు అతడికి సహాయపడి 1863లో చనిపోయింది. అవసరాన్ని బట్టి 1864లో రిబ్కాహెలెన్ రేల్‌ను పెండ్లి చేసుకొన్నాడు. ఈమె మరణ పర్యంతమూ ఫిన్నీకి అండగా ఉండింది. 1872 నుండి 75 వరకు స్వగృహంలోనే ఉండి విద్యార్థుల మధ్య గొప్ప సేవ జరిగించాడు. ఆగష్టు

16,1875 సం॥ ఫిన్నీ ఇహలోక యాత్ర చాలించి, నిత్యత్వంలో ప్రవేశించాడు.

## ఫిన్నీ సేవలో ఉన్న రహస్యం

ఫిన్నీ మహత్తర సేవ జీవిత రహస్యం ఏదంటే, అతడు 'గొప్ప ప్రార్థనాజీవి. పరిశద్ధాత్మ శక్తితో నిండినవాడు ఈ శక్తి వినేవారి హృదయాలపై గాఢమైన ముద్రవేసి పనిచేస్తుంది. అతడు ఒక మాట మాట్లాడినా, వాక్యం ఎత్తి చూపినా, సంజ్ఞ చేసినా, చూసినా పరిశుద్ధాత్మశక్తి అధికంగా కుమ్మరింపబడేది. ఆ స్థలంలో పశ్చాత్తాపంతో కూడిన మూల్గులు, కన్నీళ్లు వినవచ్చేవి. కానవచ్చేవి.

## ప్రార్థనా జీవితం

దేవుని సన్నిధిలో గడపందే అతడికి సంతోషం ఉండేదికాదు. తనకు దేవునికి మధ్య సంబంధం ఏర్పడేంత వరకు ఎక్కడికి వెళ్లినా అతడికి సంపూర్ణానందం కలిగేది కాదు. తనను తాను రిక్తుడిగా

చేసికొని ప్రత్యేక ఉపవాస ప్రార్థనలో చాలా కాలం గడిపేవాడు. దేవుని సముఖంలో తనను తాను తగ్గించుకుని సహాయం కోరి ప్రార్థిస్తే దేవుని ఆత్మ అతణ్ణి బలంగా నూతన శక్తితో నింపేది.

## పరిశుద్ధాత్మ శక్తిగల ప్రసంగీకుడు

ఫిన్నీ మోకాళ్లాని, పరిశుద్ధాత్మ ద్వారా ప్రసంగాంశాన్ని తెలిసికొనేవాడు. దేవుని ఆత్మ అతణ్ణి ఆవరించి క్రీస్తు మహిమ కోసం వాడుకునేవాడు. ఫిన్నీ బోధిస్తోంటే అతడి మాటలు వినేవారి హృదయాల్లో వాడియైన బాణాల్లో దూసుకుపోయి చీల్చేవి. అతడు ధైర్యంగా, సూటిగా, మాట్లాడేవాడు. వినేవారితో వ్యక్తిగతంగా, ముఖాముఖిగా సంభాషించేట్టుగా ఉండి, ముగింపు సమయానికి వారిని ఒక తీర్మానానికి నడిపించేటట్టుగా ఉండేది. ఒక చోట దేవుని కార్యం ఫలభరితం కానిదే మరొక చోటికి పోని విశ్వాస వీరుడు ఫిన్నీ. గోకర్నియర్, న్యూయార్క్ నగరాల్లో సభలు ముగిశాక, ఆరు సంవత్సరాల పాటు ఒక్క సినిమాగాని,

నృత్య ప్రదర్శనశాల గాని తెరవబడలేదు. అపొస్తులుల కాలం నాటి పెంతెకోస్తు దినం నుండి ఇంత వరకూ కానరాని గొప్ప ఉజీవం అక్కడ కలిగింది.

## మనలాంటి స్వభావం కలవాడే

ఏలియా లాగే ఫిన్నీ కూడా మనలాంటి మానవ స్వభావం కలవాడే. పాపాలు ఒప్పుకొని, రక్షింపబడి, ఆత్మనింపుదల పొంది వేలకొద్ది ప్రజల్ని క్రీస్తు వద్దకు నడిపించిన విశ్వాసవీరుడు ఫిన్నీ. అమెరికాలో ఆందోళనలు, పాపకార్యాలు మితిమీరినప్పుడు, రక్షణార్థమైన కృపను, శాంతిని, దైవభక్తిని, నదిగా ప్రవహింపజేయడానికి దేవుడు ఫిన్నీ జీవితాన్ని ఒక కాలువగా ఉపయోగించుకొన్నాడు. క్రీస్తును తన జీవితం ద్వారా మహిమ పర్చి క్రైస్తవ ఉజ్జీవ చరిత్రలో కీర్తి గడించిన ఫిన్నీ. భక్తుడు మనలాంటి స్వభావం గల మనిషే.